ఉన్న ఉక్కును స్టెయిన్‌లెస్ స్టీల్ (Stainless Steel) అంటారు. ఇది గృహములలో పాత్ర సామాగ్రి గాను, గృహ పరికరాలుగాను, తయారు చేయబడుటయే కాక, పరిశ్రమలలో ఉపయోగించు రియాక్టర్స్ (Reactors) తదితర ముఖ్యమైన పరికరముల తయారీకి నేడు విరివిగా వాడబడు చున్నది.

ముడిఖనిజాల నుంచి లోహాలు తయారుచేసి వాటిని మానవాళికి ఉపయోగపడునట్లుగా చేయు శాస్త్రమును లోహ శాస్త్రము (Metallurgy) అందురు. ఒక ప్పుడు ఈ శాస్త్రము కేవలము లోహ సంగ్రహణ మునకు మాత్రమే పరిమితమై ఉండెడిది. కాని మానవుని విజ్ఞానము పెరిగిన కొలది ఈ శాస్త్రము బహు శాఖలుగా మారి విస్తారమై, లోహములనుండి, మిశ్ర లోహములనుండి వాడుకొను పరికరములు తయారుచేయు పద్ధతులను, వాటి అనుబంధ చర్య లనుకూడ, వివరించుచున్నది. లోహశాస్త్రమును రెండు రకములుగా విభజించవచ్చును:

(1) సంగ్రహణ లోహ శాస్త్రము (Extractive Metallurgy)

(2) వినియుక్త లోహ శాస్త్రము (Adoptive Metallurgy)

## 1. సంగ్రహణ లోహ శాస్త్రము

లోహాన్ని పారిశ్రామికంగా తయారు చేసే విధానము దాని ముడిఖనిజాలపై ఆధారపడి ఉంటుంది. అదియే కాక ఒకే లోహాన్ని వేరు వేరు ముడిఖనిజాల నుంచి వేరు వేరు విధానాలలో తయారు చేయవలసి ఉంటుంది. లోహాన్ని తయారు చేసే విధానము క్రింది అంశాలపై ఆధారపడి ఉంటుంది.

(1) ముడి ఖనిజము యొక్క రసాయనిక స్వభావము.

(2) ముడిఖనిజములో లభించే ఇతర లోహ మలినాలు.

(3) ముడిఖనిజం యొక్క శుద్ధత్వ శాతము (Percentage).

(4) విద్యుచ్ఛక్తి మరియు యితర పారిశ్రామిక సౌకర్యాలు.

మొదట ముడి ఖనిజపు రాళ్ళను "బాల్ మిల్" (Ball Mill) తో చూర్ణము చేసి, మలిన పదార్థ ములను భౌతిక విధానాలతో వేరు చేస్తారు. నీటితో కడగటం, అయస్కాంతంతో వేరుచేయడం (అయ స్కాంత ధర్మాలు ఉన్న ఖనిజాలను వేరు చేయటా నికి మాత్రమే ఉపయోగిస్తారు.) మరియు ఫ్లొటేషన్ (Flotation) విధానము ఇట్టివే. భౌతికవిధానాలే. తదుపరి లోహ సంగ్రహణ చర్యల ద్వారా అనగా స్మెల్టింగ్ (Smelting) లోహాన్ని ద్రవరూపంలో తయారు చేసి [దీనికి ఫర్నేసులు (Furnace) ఉపయోగిస్తారు.] సాగించే విధానాల ద్వారా - లోహాలు తయారు అవుతవి. అల్యూమిని యం తయారు చేయుటకు విద్యుద్విశ్లేషణ ఘటము (Electrolytic Cell) ను ఉపయోగిస్తారు

### (2) వినియుక్త లోహ శాస్త్రము

ఈ విధముగా తయారు అయిన లోహమునకు లేక లోహ మిశ్రములను యితర వస్తువులు తయారు చేయు లేక రూపునిచ్చు శాస్త్రమును వినియుక్త లోహ శాస్త్రము అందురు. దీనిని రెండు భాగములుగా విభజించవచ్చును.

(1) భౌతిక లోహ శాస్త్రము (Physical Metallurgy)

(2) యాంత్రిక లోహ శాస్త్రము (Mechanical Metallurgy)

**భౌతిక లోహ శాస్త్రము :**

లోహముయొక్క భౌతికనిర్మాణము, భౌతికధర్మ ములు మొదలగునవి పరిశీలించు శాస్త్రము, లోహము కాని, లోహ మిశ్రములు కాని, వాటి నుంచి యితర

వస్తువుల పరికరములు, తయారుచేయుటకు తగిన సహజమైన గుణ విశేషణము (Intrinsic Characterethic) కలదియు లేనిదియు పరిశీలించుటను మెటలోగ్రాఫీ (Meatllography) అందురు. ఈ పరిశీలన వలన లోహ నిర్మాణ విషయము అనగా పలుకు పరిమాణము (Grain Size), అవి వేరు పరచబడిన విధానము, వ్యాపించిన, ఏర్పడిన విధానము, అలోహములు, కలిసి యుండుట మొదలగునవి, మరియు లోహము యొక్క యాంత్రిక ధర్మాలు (Mechanical properties) వానిపై నీటి ప్రభావము-అనే దానిని తెలుసు కొన వచ్చును. ఈ పరిశీలనకు సూక్ష్మదర్శిని (Metallubgical Microscope), మెటలోగ్రాఫ్ (Metlallo graph) మరియు ఎలక్ట్రాన్ సూక్ష్మ దర్శిని (Electron Microscope) అను పరికరములను వాడుదురు.

యివియే కాక, మిశ్రమ లోహములకు సమతా స్థితి-ఉష్ణోగ్రత-గాఢత (Equilibrium, Temperature, Composition) పటములు మరియు యక్స్-రే (X-ray) పద్ధతులను కూడా, లోహ నిర్మాణ పరిశీలనలో వాడుదురు.

లోహ నిర్మాణము (Structure)ను తగు విధాముగా మార్చుటవలన లోహ యాంత్రిక ధర్మముల (Mechanical Properties) ను మార్చు పద్ధతిని "హీట్ ట్రీట్‌మెంట్" (Heat Treatment) అందురు. ఈ చర్యయొక్క ముఖ్య ఉద్దేశము లోహముయొక్క శక్తి (Strength)ని పెంచుట మరియు యితర వస్తువులలోనికి మార్పు చేయుటకు తగిన పొందికతనము (Adaptability)ను మెత్తదనమును, కలిగించుట. ఈ చర్యలో లోహము ఒక క్రమ పద్ధతిలో వేడి చేయబడుట, చల్లార్చబడుట జరుగుచుండును.

లోహము యొక్క యాంత్రిక ధర్మములను పరీక్షించు విధానమును మెకానికల్ టెస్టింగ్ (Mechanical Testing) అందురు. లోహము యొక్క యాంత్రిక ధర్మములు, లోహము అనేక యంత్ర శక్తుల (Mechanical Forces) కు గురి చేయ బడినప్పుడు, వాటిని ఎదిరించు శక్తిని బట్టి-నిర్ణయించ (నిరూపించ) బడుతవి. ఇవి బలము (Strength), కఠినత (Hardness), యింపాక్ట్ రెసిస్టెన్స్ (Impact Resistance), ఫటీగ్ స్ట్రెంగ్త్ (Fatigue Strength), డక్టిలిటీ (Ductility) టెన్‌జైల్ స్ట్రెంగ్త్ (Tensile Strength) మొదలగునవి

లోహములను కరిగించుట, మిశ్రమ లోహములను తయారు చేయుట (Alloying), పోతపోయుట (Casting), రోలింగ్ (Rolling), ఫోర్జింగ్ (Forging), డ్రాయింగ్ (Drawing) మొదలగు పద్ధతులను విపులీకరించు శాస్త్రమును యాంత్రిక లోహ శాస్త్రము (Mechanical Metallurgy) అందురు.

డా॥ యం. వెంకటేశ్వర రావు.

# అనుబంధము

ఆంధ్రప్రదేశ్ జలవిద్యుత్ తాపవిద్యుత్ స్థావరములకు
సంబంధించిన కొన్ని చిత్రాలు.




REFERENCE

- HYDRO ELECTRIC STATI(ON)
- 132 K.V. LINE
- SUB-STATION
- RAILWAYS
- IMPORTANT METALLED RO(ADS)
- OTHER ROADS & CART TRA(CKS)
- RIVERS
- STATE BOUNDRY
- PROPOSED UNDER SILERU SCHEM(E)

# LOCATION MAP

A. Aziz 22-8-58

స్థల నిర్దేశక భూచిత్రము.

ఆంధ్రప్రదేశ్‌లో ఎగువ సీలేరు, మాచ్‌ఖండ్ ప్రాజెక్టుల ఉనికి, దీనివలన తెలియనగును.



డుడుమా జలపాతమ్ మాచ్‌ఖండ్ నది.



ఎగువ సీలేరు జలవిద్యుత్ స్థావరపు విహంగ దృశ్యము.



హైడ్రాలిక్ డ్రయివుతో మినిమమ్ అయిల్ సర్క్యూట్ బ్రేకర్



220 కిలో వాట్ల ఎ. బి. సి. బి.



తాపవిద్యుత్ స్థావరమున టవర్లు

# ప్రసిద్ధ పదసూచి

ఆ

## ఇ

ఈ



ఉ

## ఓ



## ఔ



## క

## క్ష



## ఖ

## గ

## ఘ



## చ, ఛ

జ

## డ, ఢ

## ఢ



## త

న

## ప

## బ

## భ

## య

## ర

## ల

హ